పలమున్:— స్తోత్రగ మైన నేరకరయొ, భా
షాదోగ్రహి ! భావింపుమా !

దున్న యీనిన దన దూడను గట్టుమం
చనెదునెద్దు మొద్దుజనపతి వలె
నన్ను నెంచినావొ ? సన్నకసన్న నా
దృష్టిపథమునుండి తొలఁగి పొమ్ము."

అను చాభూపుఁడు బాపనిం గినుకమై
నందుఁడి పోనాడఁ జ
య్యన శ్రీనాథుఁడు జాలిఁ బొంది కడునె
య్యం బొప్ప వాక్రుచ్చె "నో
జననాథా ! యొకమాట, యీతనిని నీ
చపా్రియునిం గాఁగ నీ
వనరా, దీతఁడు గా కవీశ్వరుఁడు భా
వాతీతభావుం డిలన్.

నిన్నటి మొద్దుబాఁపఁ డెటు
నేఁడు కవీశ్వరుఁ డంచు నెంచ, కౌ
రిక్వ న్నగజన్మ శైల్లరుఁ గ
విత్వగుణాంబును గల్గువార, లో

## శ్రీ వి రా జు.

యన్న ! కవీశా యన్న నొక
యద్భుతమానవజాతి యేడనో
యున్న దటంచు నీవు మది
నూహ యొనర్చకు మింకఁ దెల్పెదన్.

కవనగానవిచిత్ర శిల్పనములందు
నెందు నైనను బ్రజ్ఞ నీ వొందఁ దమ్మ
టంచు నిన్నను వీని కేనంటిని గదె !
మాత యను నవసరము నిత్యంబు మనకు.

జననీస్తన మే లోకం,
బని తలఁచెదునంతకాల మలనినువున కే
మనఁ బనిలేదిఁకఁ దదుపరి
ననవలెఁ గా నదియు నిదియు నంచును కవనీ.

కవనము నడుపనిచో నీ
యవనీశ్వరుఁ డిడఁడు జీవనాధార మటం
చవనీసురుఁ డేకాగ్రత
ను వఱలి కవి యయ్యెఁ దా వినూత్నవిధముగాన్.

ఏకాగ్రతార్క తేజము
లోకాజ్ఞానాంధకారలోప మొనరుపన్

## క వి రా జు.

ప్రాకట మగు కారణ ముని
లోకమువలయు నాథ! నీవ యోజింపు మిఁకన్.

యతులన్, ప్రాసములన్, గణంబులను, శ
బ్దార్థంబులన్, సద్రసో
చితులన్, శయ్యల, జాతులన్, వితతశా
స్త్రీయప్రయోగంబులన్
కృతులం జేయఁ దలంచువార లిల నా
క్రాంతైన వాచార్యసం
గతిఁ దా మెంతయు నేర్వకే రచనముల్
గావింప రా దందువో.

జలచరకోటిఁ గల్గెదవా ?
చారుమణిప్రభ నొందుదో, మహీ
వలయముఁ జుట్టి రాఁ గలవా ?
వారిద మంటెదవో ? సముద్రమున్
బలె చెలరేఁగు ! యేల యటు
పాటలు పాడుచుఁ దిర్గుచుంట ? భూ
స్థలి విడనాడి మీ వర
సఖులు పక్కన నవ్వ కుందురే ?

## కవి రా జు.

కవితావేశము గల్గువారలు నిరా
ఘాటాత్మస్ఫురత్ప్రతిభా
దవిహారప్రియులై సనాతనయమబం
ధాతిక్రమోద్వేగభృ
న్నవకూలంకషవాఙ్మయత స్ఫూర్తి యన
న్యపాస్తధీజాతభా
వవిశేషాకిలదూయమానులయి కా
వ్యాఖ్యానముల్ జేయరే!

భావావేశము, భావభూతి, వినతో
ద్భావాధికాభాసముల్,
భావప్రాజ్ఞత, భావనిష్ఠతయుఁ, ద
ద్భావప్రభాభావమే
జీవుం డొందునొ యాతఁ డొందె కవితా
శ్రీశక్తి సృష్టిస్వభా
వావిర్భూతరహస్య మిద్ది యను మాం
ద్యగ్రస్తజీవాళికిన్.

భావకవి యని వానిని వాకొనఁ దగు
వాఁడు విరచించునది యగు భావకవిత

భావకవి యగునీవేదబాపఁ డధిత !
తీనికవివేము భావ మున్నవళ్ళులారు.

తవదువినూత్న భావకవి
	తా ప్రతిభాప్రశక్తి త్రినంతముగా
వనధిని పెలి పొంగ దగిన
	వాంఛితతా లను రామి బాపఁ డా
త్రినిఁ దనపాట్టుకూటికయి
	నేవురుగొట్టు వలెకా రచించి, కా
వ్యవఁ దనకైత నాటకను
	బో పరిహాసపరీక్షుఁడై తగాఁ.

కోమలరాగభోగ, మెల
	కొన్నములు, సత్సమనోవిలాస, ము
ద్దామవరాళులు, న్వలపుఁ
	దాపము, పల్లవకోటినిండుగో
నామనిపేళఁ బాడఁ దగు
	నావరభృన్మణి దా నకాలము
దెమటి పాడి కొన్నిలకు
	నింపును సొంపు ఘటింప నేర్చునే ?

 [ఉ]

క వి రా జు.

పూర్వకవులయం దపూర్వభావము లేదొ
కారె వారు భావకవులు, పేద
బాపఁ డొకఁడె ట్లు భావకవీశ్వరుఁ
డనుచు నడిగె దేని నాలకింపు.

కనకలతామణిమంజరు
లొసరుకవనపంజరముల నుంచిరి తమచే
వాన భావరాజకీరము
లను మునుపటికవులు కావ్యలక్ష్మీధవులై.

వితతాగాధమహారసాయతనమై
పెంపారువృత్తాబ్ధి సు
సిథితిం గాఁ దను డించి భావకవి రాం
జేఁ బోవ నద్దాని సం
స్మృతిచిహ్నంబుగ నెంచి భావకవి ని
ర్మించుచు బ్రయత్నించి పరి
స్రుతపద్యాకృతిపంజరం బొకటి స
త్స్వీకారదసంప్రాప్తికై.

పూర్వకవిపద్యపంజరంబులను వెలయు
భావకీరములను నెప్పు వీడు గాంచు

## కవి రాజు.

నేఁటియీకవిపద్యంపునీడమందు
వానిఁ గన లేక పోవచ్చు వసుమతీశ !

తనగీతంబున నీకుఁ గన్పడనిరో
తద్భావతత్త్వంబు నీ
వనుమం జాతనిఁ బ్రశ్న సేయకుము స్వ
ప్నాంతర్గతానంద, మే
జనుఁ డైనన్ దగ వాక్యానం గలఁడె ? యి
చ్ఛానంద మీ వొందిత
ద్భవభావాండజపంక్తితోఁ జెగిరి పో
తత్త్వంబుఁ జింతింపుమా !

ఈకవితత్త్వముల్ మఱియు
నీకవి భావకవిత్వతత్త్వముల్
బ్రాకటలీల నే నిపుడు
భావన చేసితిఁ గాన వీనిప
ర్యాకలితపరిభావము దు
రత్యయ మంచు వచింతు నింక నీ
లోకతలాధినాథ ! విను
ముత్సుకత న్విడనాడు లోపికల్.

బళిబళి ! యెంతలోనఁ బ్రతి
    భావిభవంబు వరించె నిన్ను, నీ
"కిలఁ గల ప్రజ్ఞ పేదఱిక
    మే !" యని వాఁడవు కాదె నిన్ను, సి
స్తులగిరినిర్ఝరప్రథిత
    తుల్యకవిత్వపటుత్వధార ని
న్నలచుట వింప దుర్యోగ, ఘన
    భాన ! కృతార్థుఁడ వైతివే సుమా !

వాణీనిత్యాతుకదయ
రాణను నీ వొందకునికిఁ బ్రార్థించితివో
వాణీశుని శ్రీనాథుని
యానారీదయకు వాక్ప్రవాహము నేయన్.

శ్రీరామాయణపఠనము
భారతభాగవతసత్ప్రబంధపఠనమా
రారా ! కవితాధోరణి
కారణ మవసరము కా వటంచుఁ దెలిసితిన్.

ఎంతవిచిత్రిఁపున్నవన
    మియ్యది, పద్దెము నెంత గాంచినన్

సొంతరయూ భావగోచరము
చెప్పడ దద్దిర! కాని పాపపూ
కాంతరసీమలంగున ర
హస్యవిభావము గల్గ నొప్పు, నీ
కింతయును నీడు కైత తగు
నెన్నఁగ నీదగుశక్తి యల్పమే!

కృత్యవంతరోత్సవమున కేగు వేళ
సచివవరుఁ గనుఁగొని రాజచంద్రుఁ డంత
నీయపూర్వకృపుఁగవికి నీ వి న్నువర్ణ
పారితోషిక మని సభ వాసి చనిరొ.

పులినోటన్ బడి తప్పిపోయినటు లా
ర్పల్ బుచ్చుచున్ బేదవాఁ
డెలమిన్ దా వెలలేనికానికల నె
న్నే నొంది శ్రీనాథునిన్
బలుమా టెన్నుచు నాఁటియుత్సవఁపుశో
భ ల్మాత నూహింప నే
యిలు సేరన్ దనభార్యయున్ సుతులు ద
న్వీక్షించి యూప్పొంగఁగన్,

## కవిరాజు.

ఒకచేత ఖడ్గంబు నొకచేతఁ గావ్యంబుఁ
గొని యేన్గుపై నేగునినుని గనుచుఁ
బ్రభుపార్శ్వభాగాన బ్రాజిల్లు శ్రీనాథ
కవిరాజునకు నమస్కార మిడుచుఁ
బతదుల్కాలకు మించి పరిహసించుచు మీఁది
కెంపురాజ్వాలఁ బరికించి నగుచు
వరకృపాణములతో, వంశదండములతోఁ
జతురులు విరచించు సాముఁ గనుచు

నతులమంగళతూర్యవాద్యములు వినుచు
నాటవెలఁదులనృత్యము నీటుఁ గనుచు
నుత్సవాలోకనాగతు లుత్సుకతను
నొండొరులఁ ద్రోసికొను చేగుచుండి రపుడు.

♦ ♦ ♦

వరశృంగారరసప్రధానకవితా
వైదగ్ధ్యసంపూర్ణుఁ, డీ
శ్వరపాదాంబుజచింతనామృతరసా
స్వాదప్రమత్తుండుఁ, గా

## కవి శ్రీ జా.

కవిమత్తేభగణోగ్రసింహుఁ, డసఁగి
కాంతాతిసేవ్యుండు నా
కవి శ్రీనాథుని సంస్మరింపుము సఖా
సాక్షాత్కారంబుఁ గాంచెదవ్



## భావకవిత్వము

కంటకశోకవ్యథా కృష్ణ్యంబైన బండమీఁద
నొం డెగిరిపోయె నంత నొం డొండు మిగిలె
రెండవది పోయెఁ బిదప నం దొండు తేమ
బండమాత్రమె పాప మం దుండి పోయె.

ఆయసంభపాథోరాశి ననిలవీచి
మై జనించిన యలవళి యై తరంగ
మై మహోత్తుంగకల్లోల మై తుద నిజ
తీరమున భంగమై వార్ధిఁ దీర్ఘ మయ్యె.

ఆమనోజ్ఞసుమధురసాయంతనసమ
యమున వల ప్రాని నీ శ్రౌఢి యస్మదీయ
హృదయతంత్రులు మీఁటి హాయిగా రచించి
కాలసర్పకరాళవక్త్రమున గరఁగె.

అనిశాకాచగోళాంతరాన స్నిగ్ధ
శ్రమతరనాతిదీపికాకళిక మినుకు
మినుకు లాడి హఠాద్దీప్తిఁ గనపి శిథిల
తిమిర చేలాంచలంబుల సమసిపోయె.

## భావతురంగము.

భావకవిత్వసంపద ల
    పారము గాఁ గలఖండకావ్యముల్
నే విరచించి యున్నటిని
    నీ టగుపాత్రముగా ఘటించి, సం
భావనఁ జేయుచుంటిని వి
    భావరి నా కృతి నామ మే మనం
గావలె నంచుఁ గొంతదను
    కన్; వెనుకన్ గొనినాఁడు నిద్దురన్.

అద్దమురేయి నొక్క పురు
    షాకృతి దోఁచెను స్వప్నమందు నా,
కద్దిర ! పంగనామములు
    నాస్యమునన్ రుదురాకపేరులున్
పెద్దవి కంఠసీమమునఁ,
    బిల్లని చంకను, తాటియాకులన్
కొద్దిగ నొక్క చేత, నొక
    కుంచెను రెండవచేతఁ బూనుచున్.

వీథినాటకమున హాస్యవేషధారుఁ
డటుఁలు వచ్చితి వెవ్వఁడ వయ్య? నిన్ను

భావతురంగము.

నెప్పుడో చూచి యుండినచొప్పు దోఁచు
ననుమఁ భవదీ యవృత్తాంత మనఁగ నతఁడు.

పరిచితుఁడ నేను నీకు న న్మఱచినావు
నిదురమత్తునఁ, బో నిమ్ము నేను గినియ
రామలింగకవి యగు నానామ మోయి!
నాదునావాసము తెనాలినగర మందుఁ.

అను చాతఁ డనిననుడులను
విని భక్తి నమస్కరించి వేడ్క నడిగితిన్
"విను కవిశేఖర! యిట కే
పనిమీఁదను వచ్చినావొ పలుకు" మనంగాన్

నా పేరఁ బరఁగువాఁడవు
నా పద్యము లరసి ప్రీతి నను మెచ్చుచు నే
రేపును మాపును నాకృతు
లే పఠియించెదవు గాన నెలమి న్గొంటిన్.

నిను నాశిష్యునిఁ గాఁ గై
కొనినాఁడను కవిత నీవు కూర్చినపాత్రం
బున కేది తగినపే రని
యనుతాప మ దేల విను మదశేఁచరితమున్.

భావతరంగము:

తపనీయమణిమయోద్దామప్రభాభాసి
తోత్తుంగసింహాసనోజ్జ్వలంబు
కవిగాయకవితానగంభీరగీతాను
ధారసధారాప్రపూరితంబు
సకలశాస్త్రేతిహాసార్థవిత్పండిత
పాండిత్యచర్చాతిమండితంబు
గాంగేయపార్థవిక్రమకళాకలితాంధ్ర
వీరసింహాసమూహావిలసితంబు

నవ్యనాట్యకళాసమున్నతవరేలాను
షంగవారాంగనాపాంగమంగళంబు
వ్యజనయుగ్యంత్రపుత్రికాభ్యంచితంబు
నాతలం బాంధ్రరాయసభాంగణంబు.

కొలువు దీర్చి రాయలు గూరుచుండె
సింహపీఠిక నాసభాసీమయందు
విజయఘంటిక మ్రోయఁగ బ్రజలు నలర
వందిమాగధు లాశీనిప్రతిభఁ జాట.

అంత నొకచిత్రలేఖకుఁ డటకు వచ్చి
యశ్వచిత్రపటము దెచ్చి యావనిధవున

భావతరంగము.

కిచ్చె నద్దాని రాయలు మెచ్చి కొంతముఁ
జూపి సభ్యుల, కిట్లు సంస్తుతులు సల్పె.

"ఎంత మనోజ్ఞమై తనరు
నీజవనాశ్వచిత్రలేఖనం,
కొంతయు లోటుపా టిచట
నెంచఁగ రాదు, సజీవవాజి న
త్యంతముఁ జూచినట్టు లగు,
దాఁటెడు గుఱ్ఱము దాఁటుచున్నటే
వింత చెలంగ వ్రాయఁ బడె,
వేలకుమించినమూల్య మీఁ దగున్."

అనుచుఁ గొనియాడి చిత్రలేఖనముఁ, జిత్ర
కారునకు వేనవేలురూకల నొసంగి
"కలఁడె యొక్కఁ డైన నీచిత్రకారు మించఁ
జాలెడునతండు నాదు నాస్థానమందు."

అటుల భూజాని యాతని నభినుతింపఁ
గుపితమతి నాచ నే నంటెఁ "గువలయేశ!
ఫలమునీ తేజియీచిత్రపటము వదల
నిందుఁ గలచిత్ర మే మొకో సందియంబు,

# భావతురంగము.

తగులదు మెత్తగాఁ బరిసి
        తాఁకిన, భీతిఁగలంగఁ జేయఁ గా
నెగురదు, కొంచె మైన సకి
        లింపదు, వాలము ద్రిప్ప, దిట్టిద
శ్వగణమునందు నున్న, సగ
        పాలు గనంబడ, దెట్టిచిత్ర, మీ
పగిది విచిత్రచిత్రములు
        వందలు వేలు రచింప కుందునా?"

అనఁగ వసుధేశుఁ డాడె నాకంత నిటులు
"భావనము చేయ వలె చిత్రపటము దెలియ
భావశూన్యున కగుకుడ్యభావ మొసఁగు
నీకళాపరమరహస్య మిది నిజమ్ము.

వందలు వేలు వ్రాయఁ గల
        వాఁడవు నీవు సెబాసు! సత్కవీ!
ముందుగ నొక్క చిత్రపటం
        ముఁ రచియింపుము దానితోడ నీ
యందునఁ గల్గు ప్రజ్ఞ తెలి
        యం దగు" నంచు క్షితీశుఁ డాడె నే

గీ.

నందుల కొప్పికొంటి, సభ
యందఱీయందఱు వచ్చి మెచ్చఁగన్.

* * *

కొలువు చాలించి భూమీశతిలకుఁ డేగ,
తెఱపకడ లేచి మఱునాఁడు తేని దైన
యాసభాభవనాంతరమందుఁ గుడ్య
సీమ నొకచోట । వ్రాసితి చిత్రరచన

[illegible]
[illegible]
జాయత వైభవంబున స
ర్వాంగణసీమను బల్కె నిట్టులన్
స్నేహశుభవిధానఁ గుడ్యతల
మీఁగతిఁ బాడొనరించె నెవ్వఁడో
రా" యను వంత నే నలధ
రాధిపుఁ గాంచుచు మాఱు పల్కితిన్.

"గోడఁ బాడు చేయఁజూడగా దడి నేను
గోడమీఁదఁ గడకఁ గూర్చినట్టి

చిత్తరు వది కాని, క్షితినాథ ! వే ఱొండు
కాదు, దానిఁ గాంచ నాదు మనవి."

ఔరా ! చిత్త్రరు వేది, కుడ్యమున నే
యుం బొమసిఁ జూసి, యా
యారఁ గుంచెను వెల్లఁ గొట్టి, యిటు హా
స్యోక్తి వ్రజం బాడు దే ?
పారం బన్నది లేదె యెంతకుఁ ద్వద
భ్యస్తాతిహాస్యోక్తి క
య్యారే ! యియ్యది యాచిదంబరరహ
స్యప్రియమా నేమొకో ?

అనుచు భూనాథుఁ డించుక యలిగి పలుక
"భావనము సేయవలెఁ జిత్రపటముఁ దెలియ
భావశూన్యున కది కుడ్యభావ మొసఁగు
నీకళాపరమరహస్య మిది నిజమ్ము."

అని నే నాడినమాటలఁ గినుకఁ దా
నాలించి "నీచిత్రితే
ఖనమం దొప్పెడు భావముఁ దెలుపు వ్ర
ఖ్యాతంబుగా, నద్ది నేఁ

వినెదన్, నా కడ వచ్చు కుండునెడ నీ
నేరంబు సైపన్ క్షమా"
యనె ధాత్రీశుఁడు "వల్లె" యం చతని కే
నావెన్కన్ నిల్చితిన్.

అడిగిన భావముల్ దెలుప
నా, నటు లెందఱో కంట వీ లగున్
బడమిని, సాక్ష్యమద్ది యగుఁ
బో, కృతికర్త గతించువెన్క నే
వడువున నద్ది బోధపడు ;
పాఠకు లెందును స్వీయశక్తిచేఁ
వోడరి గ్రహింపఁగా వలెఁ గృ
తుల్ ; కృతిపాఠకధర్మ మిద్దియే.

కవులును జిత్రలేఖకు ల
ఖండగభీరవినూత్న భావముల్
ప్రవిమలదివ్యసత్కృతుల
రాజిలఁ జేతురు గాని, తత్కృతి
ప్రవరరహస్యభావవిభ
వప్రతిబింబితపూర్ణతత్త్వమున్

# భావతురంగము.

వివిధజనాళి మెచ్చఁగ వి
వేకము బుద్ధియు నీకుఁ గేర్తురే?

ఆత్మరూపము దేహమై యలరు నటులు
భావరూపము చిత్రమై పరఁగు, భావ
రహితచిత్రము జడ, మాత్మరహిత దేహ
మటులు, భావము జీవన మఖిలమునకు.

రంగులు రేఖలే సయిన
రమ్యవిచిత్రపటంబునందు ము
ఖ్యాంగము లంచు భ్రాంతిపడు
నాతఁ డెఱుంగఁడు దానితత్త్వ, మా
రంగులవెన్క గుప్త మగుఁ
బ్రాంచితభావవిశేష మెంచు తె
ల్వెం గలవానికే తెలియు
నీ లసఁ జిత్రకళారహస్యముల్.

ఉన్నది యున్నదం చనుచు
నుండెడువాఁ డఘముండు, తెల్వియై
నున్నది లే దటం చనుచు
నుండెడు నాతఁడు మధ్యముండు, లే

## భావతరంగము.

కున్నది యున్న దంచనుచు
నుండుసతంబు డీల నుత్త ముండ యశో
నెన్నఁగ నుత్తమంబులు మ
హిం గలయట్టివిమర్శకుల్ నృపా!

కచబంధచ్యుతకేశలేశ మొకఁడో
గన్పట్టఁ దన్నైల్యముం
గుచములఁ దత్పరిమాణ మెంచి యది యే
లోలాక్షిదో, యామె నే
ఁడును విద్యావిభవంబు లెట్టివో, వయో
రూపంబు లేపాటివో
వచనం బెట్టిదొ, పోల్చు నాతఁడె కళా
వైదగ్ధ్యసంపూర్ణుఁ డౌ.

ఒక పరమాణువుం గను ప
యోమయమై మను బొల్చునీపరిపం
చక పరిణామతత్త్వమును
సర్వము నెన్మది నూఁట నేయుఁడే
ప్రకటవిమర్శకప్రథితి
లక్షణ మియ్యది నిక్క మోప్రభూ

## భావతురంగము.

వికటకవీశువాక్కుని యు
పేక్ష వహించి హాసింపఁ బోకుమా !

ఆటల యుపేక్ష సేయకెడ
నక్కల పక్కల తెల్లగొడ్డు వో
వులయె ఘటిల్లు నంతఁ బరి
పోషిత భావకవిత్వ జీవముల్
పటుతరచిత్రలేఖన మ
భావగతస్థితిఁ గాంచుఁ గాన నిం
తటను మదీయచిత్రరచ
నాప్రతిభాఢ్యము నాలకింపుమా !

గండుమైఁ గుఱ్ఱెత్తి కొండ లుద్దండత
నెగురుచున్నటులు భావించుకొనుము
బ్రహ్మాండభాండార్తి వాప నిర్జరు లింద్రు
వేఁడుచున్నటులు భావించుకొనుము
ఇంద్రుఁ డుచ్చైశ్శ్రవం బెక్కి వజ్రాయుధం
బెత్తి పోవునటు భావించుకొనుము
చిత్రంబునందు విచిత్రంపుమసి పూత
రే మబ్బులంచు భావించుకొనుము

## భావతురంగము.

అట్టిమబ్బులఁ జొచ్చినయాపు పోఁదుగ్రి
వాజివాలాగ్రి మీకనఁ బడెడు తెలు ప
టనుచు భావింతు కొను మింక వినుము దీని
పేరు భావతురంగంబు ధారణీశ!

అను నాదునుపన్యాసం
బును విని పార్థివుఁడు నవ్వి మో మెత్తి యనెన్
విను చిత్రకళానిధి! నీ
యనుపమచిత్రకళ సార్థకాఖ్యం బయ్యెన్.

అనుపమసత్కృతికిఁ బ్రయో
జన మానందంబు, నాకు సంధిలె నది నీ
వినుతవిచిత్రముకతనన్
గన నల్పమె నీదుచిత్రగతకౌశలమున్.

బళిరా! యింతటిదాఁక నీకుఁ గవితా
ప్రావీణ్యమే కల్గుటన్
దలఁతున్ జిత్రకళాధిదేవతయు నిన్
గామించుటల్ నేఁడు గా
తెలిసెన్ మాకు యమస్వసాంతతితటీ
దీవ్యత్ప్రవాహాప్రిభా

మీ. శ్రీ

భావతురంగము.

---

విలసద్గుప్తసరస్వతింబలె మహోపర్వంబు సంధింపుమున్
భావతురంగ మంచుఁ బది
    పాటిగ నియ్యది సేగఁగాంచి యిం
డే విలసిల్లఁ గాక యని
    కృష్ణవిభుండు రచించి, దానిపై
నా విమలాక్షరంబులు ర
    యాన లిఖింపఁగఁ జేసి యంత నా
[illegible]
    [illegible]

ఆనాఁ డాదిగఁ జెక్కువత్సరము ల
    య్యాస్థానమం దుండె వి
జ్ఞానంబై తగునాదు చిత్తరువు, వె
    న్కన్ శతుర్విలయాద్యంధ్రసం
స్థానం బెల్ల జయించి దుర్గములఁ బ్రా
    సాదంబులన్ గొట్ట విం
కే నా భావతురంగమున్ గలిసె నాఁ
    డే మంటిలో నక్కటా!

[illegible]

# భావతురంగము.

స్మృతి గల్గెఁ, గను విచ్చి చూచుటనె నా
చెంతఁ గనఁ దోఁచె మ
త్కృతభావోన్నతఖండకావ్యవిలస
ద్విఖ్యాతసద్గ్రంథ, మ
త్కృతికిఁ "భావతురంగ" నామ మిడి త
త్కీర్తిఁ బ్రతిష్ఠించితిన్.

ప్రామరోజ్జ్వలకీర్తిరూపలలనా
రక్తుండు, నై హాస్యవా
చాచాతుర్యగుఁ డై, విమర్శనకళా
చంద్రుండు నై, కాకవి
ప్రాచీనాహిమయూరుఁ డై, కవిజన
ప్రాలంబుఁ డై యస్మదీ
యాచార్యుం డగు "రామలింగకవి" నే
నశ్రాంతముం గొల్చెదన్.

---

ఆ-థ.

## భా వ క వి.

అస్మదీయాయతనమున నమవసనికి
నూర్ధ్వలోకరహస్యభేదోపయోగ
నవ్యపరిశోధనైకయంత్రంబు గాఁగ
నుండు ముక్కాలిపీట నే నుంచినాఁడను,

ఇక్కాలంబున వాదము
నెక్కొను కవితావిశేషనియతిఁ గనుఁగొనక్
దిక్కనకవి ధ్యాని నే
నొక్కుమ్మడి ధ్యానమూన నులి పొందు నగన్.

ముక్కాలిపీట కడలఁగఁ
దిక్కనకవిసోమయాజి దిగె నని భక్తిన్
మ్రొక్కి ఏన నంటి నాతఁడు
చక్కఁగ నెఱుఁగింప నున్నసందేశంబున్.

"తిక్కనఁ గాను - భావకవి
ధీరుఁడ - నూత్నకవిత్వతత్వ మా
తిక్కన యే మెఱుంగుఁ, దల
తిక్కకవీశుఁ డతండు, నేన స
మ్యక్కరణి న్వచింపఁగ స
మర్థుఁడ నాకవితావిశేష, మీ

## భావకవి.

ఎక్కడ తిక్కయజ్వకవి
యెక్కడ యంచుఁ దలంపఁ బోకుమా.

ఇరువది యేండ్లు దాఁక పఠి
యించితి నాంగ్లము పాఠశాలలన్
జరుగ ధనంబు, దేహబల
సర్వము లన్నియు నాఁడు నాఁటి కా
ఖరుపను నందుఁ బాండితి త
గం గనిపింపక పోయె నింక నే
నెఱుఁగను సంస్కృతం బది మ
హిం నశించె మృతభాష యటంచేన్.

ఆంగ్లవిద్యాభ్యసనమున కైనకాల
మందు సగబాలు దేశభాషైకశిక్ష
కైన సంపూర్ణపాండిత్య మమర కున్నె
యని పిసురువాద మేను మెచ్చను రవంత.

అవిరళపాండితీప్రతిభ
యన్నది ప్రాప్తము కాకపోయినన్
లన ముసలాభ మేది యయి
నన్ గణుతింపఁగ లేక పోయినన్

## భావకవి.

నవనవహూణకావ్యపథ
నంబున నిక్కము దాఁప నేల నేఁ
గవి యనిపించుకొంట కొక
కాంక్ష జనించెఁ గ్రమక్రమంబుగన్.

సంస్కృతాంధ్రకవిత్వరచనమునందుఁ
గోటి నియమము లుండుటఁ గోటి కొక్కఁ
డాపనికిఁ బూనుకొనుచుండె నాంగ్లమందు
నట్లు గా కుంట హూణులం దధికకవులు.

కైతకునుఁ గట్టుబాట్లను జ్ఞాతివైర
పాటఁ బ్రాచీనకవన మాహ్లాద మిడదు,
కానఁ గైతను నియమాలు గంగఁ గలిపి
యతినిరంకుశకవుల నే ననుగమింతు.

కవనము, చిత్రలేఖనము,
గానము సాజముగా జనించు నీ
విభుజనపాళి కన్ననుడి
పొల్లు సుమా పురుషప్రయత్న మే
యవసర మున్నటకో, బ్రతిభ
యున్న మా ధారణి రిత్త పోవునే ?

క. క

# భావకవి.

కవి యను లోకసృష్ట మట
కార్యము గాదు ప్రయత్న మూనుచోట.

వ్రాయఁగా వ్రాయఁగా నగు వ్రాఁతగాఁడు
పాడఁగాఁ బాడఁగా నగుఁ బాటగాఁడు
కైతఁ జెప్పంగఁ జెప్పంగఁ గవియుఁ గానఁ
గవిగరుత్మంతుఁ డను గానొ కడెఁగి తుదకు.

హా! భావను గవి నోట కూహ లేదు
సంస్కృతకవిత్వరచనాప్రసక్తి కలుగ
డాంధ్రునిగఁ బుట్టుటనఁ దేనుఁ గాడె నేను
కాన నేనాంధ్రకవి నౌటయే నిజంబు.

గ్రాంథికాంధ్రరచన వృథా కష్టయుతము
గ్రామ్యభాషను కావ్యగౌరవము లవము
కాన నా భావమే నాది గాఁగ నింక
నాంధ్రపైశాచిభాషఁ గావ్యము రచింతు.

చదువఁగ వ్రాయఁగ విసువుం
బొదలింపనిఖండకావ్యములు నే రచియిం
చెద నాంగ్లంబున నన్నటు
లుదయింప జ్జేతు నూత్నయుగ మాంధ్రమునన్.

## భావకవి.

ఆరయ ముక్కు - వ్యాకరణ
మన్నది సున్న - ప్రయోగసంపదా
ధారము లేదు - లక్షణవి
ధానము రాదు - ప్రబంధనిర్మితిన్
గోరి ఘటించినా కొట్టి లేక
గుంఠితశక్తిని ఖండకావ్య మే
తీఱునవో రచించుటయో
దిక్కు లేక నా కసు చెవ్వ రాదిరేన్.

నగలన్ జేయుమ పంకము న్గొలిపి స్వ
ర్ణభ్రాంతిము జ్జేయున
ట్లాగిఁ బ్రాచీనకవుల్ ప్రబంధ మను చె
న్నొంది ఖండకావ్యంబులన్
దగ భాషించియు వాని నెల్ల నదుకం
గాఁ బొల్లుపద్దెంబులన్
నగిలింపన్ సమకట్టి తత్కృతుల స
త్యస్ఫూర్తి మాయింపరే.

ఒకదానాయాపట మూని దానివలె నె
న్నో మూర్తులన్ జేయున

భా వ క వి.

అకటా ! పూర్వపుఁ ప్రబంధములు వ్రా
యం జాలిరా రూపాయా–
గకమా– యాచితమా– నవీనగతియా
పాశ్చిపంచిక జ్ఞానమా–
మొక్కడుక తే దీక్ష గౌరవం బెటులు నా
కుండుక ప్రబంధాలపైక.

అనుచుఁ దద్దుర్వ్యమగ్ననమును హరించి
కోరి పదియాఱువన్నె బంగారుపాళ
యనఁగ నొక క్రొత్త ఖండకావ్యము రచింతు
భువి సదా కీర్తి నొంది మెప్పును భజింతు.

మెండుగను భావములు రాక యుండు నేని
యుండెఁ గా పూర్వకావ్యపరికాండ మవని
నందుఁ గల భావములఁ జేర్చు నాత్మకృతులఁ
దివిరి మద్భావచౌర్యముఁ దెలియ నీక.

అంగ్ల మెఱుఁగువాని కాంగ్రంథముల తెలియ ద
యాగ్లంగ్రి మెఱుఁగఁ దెలియు దాంగ్లభాష

యదియు నిదియుఁ జెలియు నట్టివారల నెల్ల
మనస్తత్త్వంబుఁ బూని మార్చుకొందు.

నా మతము స్వీకరింపక నాగసమితి
యందు సభ్యుఁడు గా కుండ నస్మదీయ
భావచార్యముఁ బ్రకటింప వచ్చువాని
కిట్టు లని బుద్ధి చెప్పెద గుట్టు చెడక.

కలుగునె వ్యక్తిభేదమును
గాలనిభేదము దేశభేద మీ
యిలఁ దలపోయ భావమున-
కెంతటి కే నది దోఁచు నేఁడనో,
తలఁపుఁగ నేడనో, యిపుడో
తప్పిన నెప్పుడో నిశ్చయంబు, నిక్క
గలఁడెవఁడు సంశయంబునకుఁ
గారణ మజ్ఞత దుర్విమర్శకా !

భావము భాషయు నవినా
భావం బగుమైత్రి నుంట భాషను వినుచో
భావము స్ఫురింప వలెఁ ద
ద్భావంబును దెలుప నుచితభాషయు వలయున్.

## భావకవి.

త్రిలక్షణముల మద్దీ
తాలను గన రామిఁ గుకవి తప్పులు పట్టం
బోలు నని యూహ సేసియు
నీలా గని తర్కమూన నెంచితి నంతన్.

కంటకాకీర్ణశాఖానికాయములను
జెండి, నియమాన ఖండించి చిన్నరంధ్రి
ములనొనర్చినఁ గాని సమ్మోహనైక
గాన మొసఁగునె పిల్లనగ్రోవి ధ్వనిని.

పలుగులకతాలు గలిగినఁ
గలుగునె సున్నంబు కాలిమిఁ గాల్చియు వానిన్
జలమునఁ గలుపక - శక్తి
ఫలి యన్న సదుక్తిఁ దలఁప వలదే మదిలోన్.

ఆలోచనాగ్ని మద్దీ
తాలను గాలించియు రసయుతములుగఁ జేయన్
గ్రాలును భావసుధాసా
రాలు మహాకావ్యసౌధరచయిత మెచ్చన్.

నీదుపద్యభావ. నే నెంత గనినను
భావ మొక్కఁ డేని బయలుపడదు

# భావకవి.

నీవ నీదుపద్యభావము నను మన
సెల్లిదముగ నగుచు నిట్టు లందు.

సర్వమిథ్యాప్రపంచంబు సత్య మనుచుఁ
జెలఁగి వాదోపవాదముల్ చేయునట్టి
కవివిమర్శకులకుఁ గష్టకార్య మౌను
భావ మొక్కఁడు గన నాదుపద్దెమందు.

భావావేశసమయమున
నే నేవో వ్రాసినాఁడ నిపు డదునఁగ నే
నేవిధిఁ దెలుపుదు నీ వా
భావావేశంబు నొంది భావింపఁ దగున్.

ఇటులు కృపాణఖేటముల
నెల్లఁ దయారొనరించితొన్నయుఁ
దటఁ బ్రకటించినాఁడఁ గవి
తారతి నాఁబడుమాసపత్రికన్
స్ఫుటముగ మన్మ్రతానుగత
సూక్తుల నెల్ల వెలార్చినాఁడఁ, బి
మ్మట సమకూర్చినాఁడ గరి
మంబున భావకుమారసంఘమున్.

# భావకవి.

తెనుఁ గాడుటను వ్రాయుటనుఁ దెలియ న్వలె
నాంగ్లభాషాజ్ఞాన మవసరంబు
దేశాటనోత్కటాశీల ముండ న్వలె
సద్యోగమూన బుద్ధి యుంచరాదు
భావగీతాలను బాడుచుండ న్వలెఁ
బూర్వకవులఁ దిట్టి పోయు వలయు
స్వేచ్ఛావిహారంబు సేయ వలెఁగా, సభ్యు
లొకరినొకరు మెచ్చుచుండవలయు

నప్పకవి చెప్పినది యెల్లఁ దప్పు వలయు
నరయఁ గర్ణద్వయముఁ గప్పి యాదిపరులఁ
దెంచ వలెఁ, నూత్నవేషంబు వేయ వలయు
మాసమితిసభ్యులకు నియమంబు లివ్వి.

పరిహాసితకవులరచనా
సరణిని గవిసమయములను శయ్యను వృత్తిన్
సరసాలంకృతి జాతులఁ
బరిహారమొనర్చి నూత్నపథగమనుఁడ నై.

పరిపూర్ణచంద్రబింబం బనఁ దత్కావుత్
తాను రాకంటిని రామమోహను

# భావకవి.

పద్యశతకమున వారు కావ్యంబు వ్రాయ
పద్యమొకండున నొక కావ్యభావ మడఁచి
వ్రాసి నాఁడను గావునఁ బద్దెమునకు
నొకసుపాత్రంబుఁ బరిమళించి యుంటి నేను.

ఇట్లు లెన్నేఁ గృతులు రచియించినాఁడ
దేశదేశాలవెంబడిఁ దిరిగినాఁడ
వాయి నొవ్వంగ గీతాలు పాడినాఁడ
భావకవి యనునొక పేరు వడసినాఁడ.

ఇతరకృతిరత్నములమాట కేమి గాని
"అధికమాస" నామంబున నస్మదీయ
ఖండకావ్యాలు గొన్నింటిఁ గడఁగి కూర్చి
యెలమి నొకపాత్రమును బరిమళించి యుంటి

ఉభయభాషాప్రవీణు లత్యుగ్రమూర్తు
లగుచు నుండిరి మత్కావ్య మరసి కాని
యాంగ్లభాషాభిమాను లత్యాదరమున
నాంధ్ర "కీట్సు"ని నను గొనియాడుచుండ్రి.

అరసికులు సంస్కృతాంధ్రవిద్యాప్రవీణు
లనుచు నవ్వారితో వాదు లాడ కుంటి,

## భావ కవి.

మఱియుదుర్గ్రాహ్య పుసుమద్వ్యాఖ్యానంబు
కాన వాదింప దొరకొన్నఁ గార్యమున్నె ?

తెనుఁగును నాంగ్లముఁ దెలియు
దిట్టపులందునఁ జెక్కుఁ గాఁగ నే
నను కొనినట్లు నాసమితి
యందునఁ జేరకఁ యుంట, దుర్విమ
ర్శనమూన సంస్కృతాంధ్రకవి
సంతతి నఙ్ హసియించుచుంట, నా
ఘనకవితాప్రవృత్తి కిది
కాలము గా దని నే నెఱింగితిన్.

శేరదమూలు మెఱుము లురుములు
కరకలు జడి గలుగువర్షకాలమునం దా
పరభృతము పంచమస్వర
సురుచిరగానంబు సేయఁ జూచుటఁ గలదే?

కుకవి బోధముడి మబ్బులు, కోపదృగ్వి
తానవిద్యుత్తులు, విమర్శనానుగర్జ
లలము దుర్దినములలోన నస్మదీయ
సుకవితాపరభృత ముండు చోటు కలదె ?

స్థలి భాషింపుటఁ బ్రేతలోకమునైనా
సం బబ్బఁ గార్త్రిబ్బులో
పల సౌదామనిఁ బోలుమే లొకటి ప్రా
ప్తం బయ్యోఁ దల్లోకమం
దల మెన్ సూక్ష్మత బుద్ధి కైహికతను
త్యాగంబు ప్రాపింపఁగన్.

స్థూలదేహము విడుచుట–సూక్ష్మదేహ
మొందుటనె సూక్ష్మబుద్ధి నే నొందినాఁడఁ
బూర్వమే నెఱుఁగని భావభూతి దోఁచు
మదర్చిత భావగీతాలమాల నిపుడు.

ఇపు డుడయించు భావముల
నేను వచించి వెలార్ప వీలు లే
దపు డపు డిట్లు నీకడకు
నాఁదట వచ్చి లిఖించుచుందు, నీ
వెపుడు మదీయగీతముల
కీనవభావములన్ వెలార్తువో
యపుడు కృతార్థతన్ బడసి
యుం దుదయించెద నేను గర్విమ్మురన్.

# భా వ క వి.

అధికమాసాఖ్యకావ్యమునందు నుండు
నఖిలగీతాలభావము లారసి పోవ
వేళ యీరేయిఁ జాలమి వేగ నొక్క
గీతభావము నని పోదు పేర్చితవీథి.

(భావగీతము)

గరుడవాహన మెక్కెఁ గంజనాభుండు-
ఎత్తె వజ్రాయుధం బెలమి నింద్రుండు-
ఏనుఁగుతో ఉక్షముం గూడె శంభుండు -
ఖేదమోదము లొందె గిరిజాత మెండు-

(తద్గీతభావము)

మనుభూమీధరపంక్తి పక్షములతో
భూభాగమం, దాకసం
బున స్వేచ్ఛారతి వాయువేగమున సం
పూర్ణపరిమోదంబుతోఁ
జనుచున్ స్థావరజంగమాదులకు న
క్రాంతంబు సంఘూర్ణనం
బున సంక్షోభవినాశనాదిగతులన్
బుట్టించు టూహింపుమా,

ప్ర.శ్రీ

## భావకవి.

కొండలను త్రొక్కి తెన్నండు మందు నొక్కి
యడచు సంశయ మొందకు మట్లు గాక
యేల వజ్రాయుధము సృజియింపఁబడియె ?
వజ్రమును వజ్రమే కొట్ట నలయుఁ గాదె !

అనుపమపక్షగర్వమున
　　నద్రిసమూహము క్రిందుమీఁదులన్
గనక వినాశదూత లయి
　　గ్రామములన్, నరులన్, మృగంబులన్
వనములఁ, బక్షులన్ సతముఁ
　　బాడొనరించుట కాక వ్యోమసీ
మను జని దేవతానిచయ
　　మార్గనిరోధ మొనర్చునక్కటా !

అంబరంబున విహారంబు సల్పెదువిమా
　　నంబుల కడ్డు నిత్యంబుఁ దగిలి
తటినీతటాకాబ్ధితతిఁ దటాలునఁ బడి
　　వరదలన్ బల్లెల వరుస నూడ్చి
ప్రాసాదదివ్యదేవాలయపాళిపైఁ
　　బడి సజ్జనములఁ నవ్వాదిఁ గూల్చి

# భావకవి.

దంతిగోగణసాధుజంతుసంతతులపైఁ
బడి హతాత్ముగ వానిఁ బరిహరించి

స్వాదుఫలముల నిడువృక్షవాటిమీఁదఁ
దపము సలిపెడుమునిజనతతులమీఁదఁ
బడివినాశము సల్పుపక్షపర్వ
తముల దుర్మార్గచర్యలు తలఁపె తెలుప ?

ప్రళయసమయాన గ్రహములు క్రమము దప్పి
విశ్వసంక్షోభ మొనరించువిధము గాఁగఁ
బర్వతంబులు చెలరేఁగి ప్రతిదినంబుఁ
బ్రళయ మొనర్చుభూనభోభాగములను.

కావున భుజగజాలు లెవి కాలు
నేవిధమున నైన నిమ్మహీధరబాధా
భావముఁ గోరుచు నేక
గ్రీవంబుగ మొఱలు వెట్టిరి సురేంద్రుకడన్.

తనయైరావతదంతి నెక్కి హరి య
త్యంతోగ్రక్రోధాగ్రకోటిన్
జని తత్పర్వతపంక్తిపక్షముల రో
షస్ఫూర్తి వజ్రాయుధం

## భావకష్.

ప్రళయ వేగ మూని పరచెను గరుడుండు
భూరజంబు నింగి ముట్టె నంత.

ఆరజఃపటలంబు జలాశయములఁ
బడుచు నింకింపఁ జేయ నవ్వార్ధిసయిత
మింక మొదలిడె దానిలో నిమిడియుండు
వైరి మైనాకుఁ డంతట బయలుపడియె.

అది గదా సమయం బను చమరనాథుఁ
డెత్తి వజ్రాయుధంబుఁ జే రెలమితోడ
నఱికె మైనాకు రెక్కలు, నాఁటనుండి
యద్రు లన్నియు నచలము లయ్యె భువిని.

గరుడపక్షపరిచాలనకారణమునఁ
దగురజోనిచయంబు మూర్ధస్థగంగ
నెంత కశ్మలియింపఁ జేయునో యేమొ యనుచుఁ
బూనె నేనుఁగుతోల్మొలిముసుఁగు శివుఁడు.

అలగజాసురు వధియించునపుడు శంభుఁ
డాత్మరక్షోపయోగార్థ మతనిచర్మ
మూను వర మిచ్చినందునఁ బూనె, నాత్మ
రక్ష జరుగుఁ గాదె యూర్ధ్వాంగరక్ష యనుచు.

ప్ర

మగఁడు బ్రతికియుండఁ దగెను సాహసవతికి
ముసుఁగటంచు గిరిజ మోద మొందె
సోదరునకుఁ బత్నిమాపన మాటలౌ
ఖేదకారణంబు గిరిజ కపుడు.

కవి సృష్టిం గలయద్భుతపరిష్కృతిశిల్పం
గారంబు ప్రచ్ఛన్నమై
నివుడం జేయుఁ దమోవితాన మదె! కం
టే! మెల్ల మెల్లగా జనుగా,
చెవి సోఁకుగా దొలికోడికూఁత యిఁక భూ
సీమగా వసింపంగ రా
దవు రారా! మలికోఁడికూఁత విన రా
దాత్మీయలోకాశ్రితుల్.

మొదలగుశుక్లపక్షగిరి
మోదయ మింతటి నుండి, యందు ని
న్నొ దరియ వీలు లేదు, గమ
నోద్ధతిఁ గ్రిమ్మరఁ గృష్ణపక్షముం
దుఁ దెరలి వచ్చి గూడెద నా
దూర్జితపద్యనినాత్మ భావసం

వదలఁ గ్రిమ్మంబుగా, నిబెన

మస్కృతి నందును పోయివచ్చెదన్.

  

అల్లముక్కాలిపేట సాయమునఁ జేసి

యాంధ్రపైశాచిభాషలో నతఁడు వ్రాయు

దేశభాషాహితోక్త సందేశరూప

పంక్తులకుఁ దక్షిణామె ఛాయ వ్రాసినాఁడ.

  

లేఁగతెనుంగుపాపనుఁ గు

లీనను మంజులశయ్య నుంచి, సం

ప్రీతినిఁ బెంచి, పాకరస

వృత్తుల రీతుల నీతులన్, గుణా

ఖ్యాతకళారహస్యముల

నరిమిలి నేర్పి, యలంకృతిప్రభో

పేతగఁ బెద్దఁ జేసినక

వీంద్రుని తిక్కనయాజిఁ గాల్చెదన్.



## గణాధిపస్తుతి.

నీవు గణేశ్వరుండ వని
నీల్గకు మింకఁ, గళానిధిప్రకాం
తావహదృష్టిమాత్రమునఁ
బావకశక్తియొ కెంతొ చెక్కలై
పోవఁగ లేదె ! నీ పెనుఁ
బొప్పకు మూఁపయి చట్టిపోదె శ్రీ
దేవర ! వారితీవ్రతర
దృష్టిని జీవనభంగ మౌఁ జుమా !

బళిరా ! నీదగుపాండితీవిభవస
ర్వస్వమ్ము న మ్మరయ్యె నీ
యిల నవ్యాసుఁడు వ్యాసఘట్టములు వ్రా
యింపంగ నౌనౌఁడె, నీ
తలమీఁదన్ జనులేఖకు ల్గలరు, పం
తా లేల గుజ్జంపురా
తులతో మూషికవాహనుండ వను చెం
దుం బోవు లంబోదరా !

అనుకళావిభూతి విం
ధావళి పెట్టినభిక్ష నీకు, నీ

# గణాధిపతి.

వేసము కృత్రిమం బైనను
చేసినబొంతనా బోలుజీవితం,
బీసున కిక్కుఁ వౌదు, వెలఁ
జే సుమ నీతలకాయ, యింక
నీవేసగణిం దలంప మెఱఁగ
మెత్తుట కాదె, గజాననాఖ్యుఁడా!

జంటగఁ దోఁచి గొంటుఁ దగు
శబ్దము నర్థము నా కొసంగుము
క్రుంటిని గౌరిఁ దత్పరతఁ
గాంచఁగ నేగడు భార్గవుండు నీ
తుంటరిచేఁతకుఁ గినిసి
తోరఁపుదంతము నూడఁ గొట్టె గొ
డ్డంటను మున్ను, నీ విఁకను
డంబముల న్విడు మేకదంతుఁడా!

శ్లోకపదంబునం బలుకు
గస్త్యుఁడు కుప్పింకిడి పోవుదారిలోఁ
గాకవిపై కమండలువు
గాలను దన్నితి వంతె కాని [illegible]

## కాశీ పత్రి.

త్రైకవదంబునే తనచు

ఖండకమండలువం దిమిడ్చి భూ

లోకవిహార మాయునివ

రుం డొనరించుట న్యాపఁ గన్గితే ?

ఆలశ్రీరంగనివిగ్రహంబుఁ గొని నీ

వానాఁ డిలం ద్రోసి పోఁ

గలుగన్ జాలితివా ? విభీషణుఁడు గి

స్క నొప్పిండి నన్నాఁడి ని

న్నలిమిన్ బట్టక కొట్టఁడా ? "తిరుచనా

పల్లిన్" స్తుతిం దెచ్చెనో !

తలమీఁదం గలగాయమున్ దడుముకో !

దౌర్జన్యము న్యాసుకో !

ప్రతిగేహంబున మాఱె దీవు, మహిం నె

వ్వాఁ డైన నేదే నిడన్

గతుకన్ జూతువు, జాతిభేదమును లె

క్కన్ జేయ వాభుక్తిక్కె,

మిత మున్ సూక్తిఁ దలంప వింతయాను నె

మ్మిన్ దిండిపోతా ! నమ

## గణాధిపతీ.

స్ఫూర్తి నీ కొసఁగఁ ద్వదీయ భావ ములని
స్నీ! హేయమా నేరికిన్ .

బహుభార్యతఁ గలవాఁడ వీ వయిన నీ
ప్రాపంచికత నిన్నుఁ బ్ర
త్యాహతముగ విల్లడగ బ్రహ్మచారి వను మూ
హం జేసి నీయొద్దఁ ద
న్మహితో జంచిల బుద్ధి సిద్ధిఁ గనమిన్,
సత్యం బగుం గాక, నిన్
బహుభార్యుల గలబ్రహ్మచారి వని నే
భావింతు హేరంబుఁడా!

వసధిన్ ద్రచ్చెడు వేళ లక్ష్మి జనియిం
పన్ దానిఁ బెండ్లాడఁగా
మనమున్ జేసి, పదియలబ్ధిఁ గలఁడై
మా నాన్నఁ దున్నంత నా
యనతోఁ బో రొనరించి యోడితివి కా
నా? బ్రహ్మచారిత్వల
క్షణమా యియ్యది? యే రెఱుంగరు ధవ
చ్చారిత్రిక వ్యాంశమున్?

వ్యర్థవిశేషము ల్గొలుపుఁ
బండితుఁ డాశ్రితజాతి కెందు, నీ
ప్రార్థనఁ జేయ విఘ్నములె
ప్రాప్తము సేతువు కాన సర్వదా
వ్యర్థము, వ్యర్థ మయ్యె ! నిను
భావన సేయుట విఘ్ననాయకా !

లోకక్షేమము లాభము నెంచుచుని
ర్లోభుండ నే నంచు, ని
త్యైకాంతు న్నడి క్షేమలాభముఖసం
తాపప్రమోదంబు, నీ
వే కైకొంటివి, వంచకుండ వయి హా
యిట్టుంటివి విఘ్నేశ్వరా !
నీకాపట్యము లేటతెల్ల మిఁక దు
ర్కీర్తిన్ విసర్జింపుమా !

పనివడి పిండిబొమ్మ వని
ప్రాణము వోసియుఁ బెద్దఁ జేయ నీ
జననియు, దేవతల్ — విబుధ
సంతతి సర్వము కన్న మిన్న వీ

# గణాధిపతి.

వలి మును మున్న నోయి ప్రథ
మార్చనగౌరవ మొందఁ జూతు వెం
మున జగతిన్ గృతఘ్నుఁడ! యా
గ్రోచితవర్తనమూను నొప్పదే !

నినుఁ బూజించుట నీమహాగుణములన్
నీసత్కార్యప్రాభవం
బునఁ, నీమోమునుఁ జూచి కాదు సుమ యో
ఘ్రన్ నమ్మి నామాట నో
గణనాథా! భవదీయదుర్మ్రాళము, దు
ష్కార్యంబులం గాంచి భా
వనమున్జేతురు విఘ్నభీతిఁ గృతులన్
బ్రాపించికుల్, పూజ్యుఁడా !

◆ ◆ ◆



# తప్పొప్పుల పట్టిక.

| నెం. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 1 | 8 | 4 | గజాకని | గంగాగని |
| 2 | 12 | 18 | అయితవారు | అయినారు |
| 3 | 14 | 6 | గవిరసంబు | గవిసరంబు |
| 4 | 16 | 8 | కృతిసేయని | కృతిసేయని |
| 5 | 16 | 18 | వెల్గెన్వని | వెల్గెదివ్య |
| 6 | 20 | 2 | వేమరాక్టుంజరుండు | వేమరాట్కుంజరుండు |
| 7 | 27 | 2 | బూండ్లునుబట్టు | బూండ్లుబట్టు |
| 8 | 32 | 11 | ఆనియిష్టదేవతా | అననిష్టదేనతా |
| 9 | 39 | 3,4 | శబ్ధార్ధంబులఁ | శబ్దార్థంబులఁ |
| 10 | 41 | 16 | నాపరభన్మణి | నాపరభృన్మణి |
| 11 | 50 | 2 | నొండొండు | నందొండు |
| 12 | 50 | 7 | తుదనిజ | తదీయ |
| 13 | 65 | 8 | రక్తుండు, సై | రక్తుండుసై |
| 14 | 73 | 5 | బ్రికటింబ | ప్రకటింప |
| 15 | 77 | 1 | పంషితమందలి | పండితమండలి |

లలితాప్రెస్, రాజమండ్రి.

# OPINIONS

*M. R. Ry.* **Jayanti Ramaih Pantulugaru.** B. A. B L.

Telugu literature is not altogether wanting in the humourous element but in most of such poems the humour has taken the serious form of Personal sarcasm and is offensive The humour of the present poems in "*Suklapaksham*" is mild and is directed not against persons but against Certain new modes in Telugu poetry to which the rather inappropriate name "*Bhavakavitvam*" is generally applied. Their new poetry consists of fragmentary poems embodying stray ideas and is modelled somewhat after English lyrics, And being in many cases the production of amateur genius whose acquaintance with Classical Telugu literature and command of Telugu language are meagre it often fails to express fully what the authors mean to convey. The poem "*Bhavatvrangam*" which embodies a well known anecdote attributed to "*Krishnadevaraya*" and the poet "Tenali Ramalinga Kavi" may be taken to point to this defect. Their poetry sometimes puts on a veil of mysticism as if to cover poverty of thought. The little Poem "Bhavakavitvam" is perhaps meant to caricature this feature.

I confidently hope for longer poems in future from the pen of this talented author *Mr.* A. **Ramalingaswamy,**

**PITHAPURAM,**
**24-6-31.**

J. Ramiah.

మహారాజశ్రీ

## రావుసాహెబ్ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు

"శుక్లపక్షము" లోని కవితలు కొన్ని పత్రికలలో ప్రకటిత మయినప్పుడు చదివి చాలా సంతోషించినాను; "ఓహో! క్రొత్త తెలుగు కవిత ఆవిర్భవించినదే!" అని అనుకొన్నాను. ఇప్పుడు శ్రీ రామలింగస్వామి పంతులుగారు తమకవితలన్నీ చేర్చి ఒక్క పుస్తకముగా అచ్చువేయించినందున అవి అన్నీ చదువుటకు వీలయినది; చదివినందువల్ల నా అభిప్రాయము దృఢపడ్డది. మొట్టమొదటి పద్యమునుండి చిట్టచివరిపద్యముదాకా నాలోనేను ఆనందిస్తూ కవియొక్క ఉక్తి విశేషములు మెచ్చుకొంటూ చదివినాను. హాస్యములో మోటుతనములేదు; మిక్కిలినాజూకుగా ఉన్నది పరిహాసము; స్త్రీలూ పురుషులూ, పిల్లలూ పెద్దలూ, పండితులూ పామరులూ, గ్రాంథికభాషా సంప్రదాయములు తెలిసినవారైతే స్వయం చదువుకొని కానీ చదివించివిని కానీ, సంతోషించవచ్చును.

సంస్కృతభాషలో రచించిన ప్రహసనాలు కొన్ని చదివి ఎరుగుదును. వాటిలోని హాస్యము మోటుగాను పచ్చిపచ్చిగాను నామట్టుకునాకు అసహ్యముగాను ఉన్నది. సంస్కృత కవితను అనుసరించిన తెలుగుకవితలోకూడా హాస్యము ఆలాగుననే ఉన్నది. అది కవుల దోషమనగూడదు. పూర్వకాలమందు ప్రభువుల చిత్తవృత్తికిన్ని ప్రజలరుచులకున్ను అను

రోధముగా కవులు రచించినారు. ఏకాలమందైనా ఏదేశమందైనా ఈప్రకారము జరుగకతప్పదు. గ్రీసు, ఇతలీ ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలయిన దేశములందున్నూ పూర్వకాలపు కవితలలో మోటుహాస్యము కొంచెము ఎక్కువ తక్కువగా కనబడకపోదు. నాటకాలలో నర్మసఖుడు విదూషకుడు రాజులతో చేసేసంభాషణ, భాగోతములో హాస్యగాడు కృష్ణమూర్తితోను సత్యభామతోను ఆడే పరాచకాలు మన కాలములో అసహ్యమవుతూఉన్నవి. ఇప్పటి రసికులరుచులలో మార్పుకలిగినది. ఈమార్పును అనుసరించి కవితలోని హాస్యముకూడా మారుతున్నది. నాజూకుగా హాస్యరచన చేసే తెలుగుకవులలో శ్రీ అనంతపంతుల రామలింగస్వామి గారు అగ్రగణ్యులనుకొంటాను.

వీరి "హాస్యము" 'గ్రామ్య' భాషా సాహాయ్యమును అపేక్షించలేదు. తమ కవితావిధానమునకు అనుకూలముగా గ్రాంధికాంధ్రభాష అలవర్చుకొన్నట్టు కనబడుతున్నది. శిష్టవ్యవహారస్థభాషలో నాజూకుగా, ఔచిత్యభంగము కాకుండా హాస్యము, భక్తి, వాత్సల్యము, మొదలయిన రసములన్నీ వ్యక్తపరచ వచ్చును. కవిగారు 'స్వభాషలో' కవిత రచించుటకు ప్రయత్నిస్తే నెగ్గకపోరు; అట్టి కవిత ఆబాలగోపాలము అందరికీ సుబోధముగాఉంటుంది; మోటుహాస్యము అసహ్యమవుతుంది; ఉచితమైన హాస్యమందు అభిరుచి కలుగుతుంది.

పర్లాకిమిడి,
5—2—1932.

గి॥ వెం॥ రామమూర్తి.

బ్రహ్మశ్రీ
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

"శుక్లపక్ష" మను నీఖండకావ్యము నేఁడు భావ కవులమనుకొని యభావకవిత్వమును జెప్పువారిని బరిహ సించును. లోకములో నిందార్హములగు కార్యములగునప్పు డట్టిగ్రంథములుపుట్టుట స్వభావసిద్ధమే. ఆంధ్రసారస్వత మున వ్యక్తుల నధిక్షేపించు గ్రంథములు లేకపోలేదు గాని యొక కవితాసంస్థను చమత్కారముగా నధిక్షేపించుచు విమ ర్శించుచునీ 'శుక్లపక్షము' వంటి గ్రంథములు లేవని చెప్పవచ్చును. ఇట్టి కావ్యవిరచనకు శ్రీ రామలింగస్వామిగారు మార్గదర్శ కులని నాయభిప్రాయము. ఇందలి వ్యాసములకు వీరుపెట్టిన పేళ్లు సమంజసములు. భావ కవిత్వవిషయమునఁ దమకుఁ దోఁచిన యభిప్రాయములను వీరు పరిపూర్ణముగా నీగ్రంథ మునఁజొప్పించిరి. పెక్కుస్థలముల నాయా భావములనర్థము నఁజూపినట్లుచూపిరి. ఇందుఁ బ్రతిపద్యము రసవత్తరముగా నున్నది. రామలింగస్వామిగారి కవిత్వము నాతి కఠినమృదు మధురశైలిం బొందియుండునని నేనిటఁజెప్పుట విన్నదాని విని పించుటయే. ఇప్పటివారిలోనిట్లు చర్చించి సారవంతములగు పద్యములు వ్రాయువా రరిది.

రాజమహేంద్రవరము,
1—1—1932.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

బ్రహ్మశ్రీ
కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి, బాలకళానిధి,
బాలసరస్వతి, శతావధాని, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారు.

శ్రీమత్పరదేవతాయైనమః

'శుక్లపక్షము' అను నీక్రొత్త పోకడగలపొత్తమును నేనామూలాగ్రము చదివియుఁ జదివించియు నిందలివిశేషాంశములను గ్రహించితిని. ఇది కేవలమునూతన సృష్టి. ఇట్లగుటకుంగతము వేఱొకనూతనసృష్టియే. అనఁగానేమందురా— ఇప్పుడు కొలఁదికాలమునుండి కవిత్వమున నొకక్రొత్త పోకడ ప్రారంభమైనది. పలువురు యువకవు లాపోకడనే రచించుచున్నవారు. ఆరచనల భావమును గ్రహించుట సామాన్యులకే కాదు—పెద్దపెద్ద వ్యాఖ్యాతలకును దురవగాహముగనేయున్నయది. ఇంతియకాదు.

" జీవతః కవేః ప్రష్టవ్యమ్ "

అనిమెంచి గ్రంథకర్తయొద్దకరిగి. దీనిభావమేమన—'నాకేమి తెలియును నీవేచూచుకొ'మ్మనుటగూడ ననుభూతమగుటచే నీకవిత్వమేల యుదయించుచున్నదో చెప్పవీలులేకున్నయది. దీని ననేకులు— "భావ కవిత్వము" నావినియుంటిని. కాని. యీపేరిద్దాని కెంతవఱకుచితమో నిర్ణయింపజాలను. మొత్తమిట్టిరచనకుఁగారణమువంగభాషాకవులరచనయని పలువురనగా

వింటిని. వంగభాషాకవులకు మార్గదర్శకము హూణభాషా రచనయనియును విందును. ఏమైననేమి, పై రెండు భాషల యందును గలరచనయందలి విశేషమును గ్రహించుశక్తి నాకు లేకున్నను, తత్తద్భాషా నిష్ణాతుల యానందమునుబట్టి—

" ఆప్తవాక్యం ప్రమాణమ్ "

అనుటచే నవి యట్టివియని విశ్వసించియు, నీభాష యందంతో యింతో ప్రవేశముండియుఁ గొంచెమేని యానందము గలుగకుంటచే నీ 'భావకవిత్వమును' గవనముగా విశ్వసింపఁజాలని వారిలో నే నొకఁడ నైతిని. నా భావమున కనుగుణముగా నీ రామలింగస్వామిగారు యువకవులయ్యుఁ బూర్వకవుల యాచారము ననుసరించి యొకవ్యక్తికి మనసు నొచ్చు పోకడలుపోక కేవల భాషావిషయమును మనమం దుంచికొని దీనిని రచించి తమయభిప్రాయమును వెల్లడించిరి. ఇట్టికావ్యము లింతవఱకు మనభాషయందు లేనిలోటును దీర్చిన పరిష్కృతగ్రంథకర్త శ్లాఘ్యుఁడేకాక శ్లాఘ్యతముఁడు గూడ నని నాయభిప్రాయము.

కడియం,
తూ॥ గో॥ జిల్లా.
తే 24—2—1932 ది.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి,
శతావధాని.

———

*M. R Ry.,*

V. Ch Sita Ramaswamy Sastri Garu,

Junior Lecturer in Telugu,

**Oriental Research Institute. Madras University.**

ఆర్యవర్యా,

మీరచించిన 'శుక్లపక్షమును' జదివి యానందించితిని. అందలి కవిత ధారావాహియై మృదుమధురరచనాకలిత మగుచు నూతనఫక్కిని విలసిల్లుచున్నది. భావకవితలనం బఱుచు నేఁడు బయలువెడలుచున్న ఖండకావ్యములలో ననేకము లభిప్రాయావేదకశబ్దసామగ్రీపూర్ణములుకాక యర్థవ్యక్తిగుణభూషితములు కాకున్నమాట నిజమే. అట్టివానిం జక్కఁజేయుట కిట్టివిమర్శనము లావశ్యకములే. విమర్శనము వాఙ్మయమహోదయమునకుం బ్రధానమగుటచే మీవిమర్శన మాంధ్రవాఙ్మయాభివృద్ధికి మిక్కిలి యుపకారకమని నాయభిప్రాయము.

ప్రాచీనాంధ్రమహాకవులు కుకవి నిందారూపమున నేతాదృశ విమర్శనచ్ఛాయను జూపియున్నను వానియం దిట్టి మార్దవసారస్య వైశాల్యములు లేమింజేసి మీశుక్లపక్షము పూర్వసద్విమర్శనగ్రంథమని చెప్పుటకు సందేహము లేదు.

మదరాసు,
27—3—1932.

వఝల చినసీతారామస్వామి శాస్త్రి.

*M. R. Ry*

## Pingali Lakshmi Kantam Garu, M.A.,

### Lecturer, **Andhra University**.

ఇప్పటి కవిత్వమునకు "భావకవిత్వము" అని యే మహానుభావుఁడే దుర్ముహూర్తమున నామకరణము చేసెనో కాని, నాఁటినుండియు నిది బహుజనదూషణకుఁబాత్రమై నవయుచున్నదనుట స్పష్టము. పేరుమాట యటుంచి, యీ కవిత్వము నిజముగా, నంతదుష్టమా, యిందేదియు గుణము లేనేలేదా యను విషయమును, సహృదయుఁడెవఁడేని, నిష్పాక్షికబుద్ధితో విచారించి తేల్చవలసియున్నది. భావకవులలోఁగూడ గొందఱు సరసముగ వ్రాయువారు లేకపో లేదని పల్వుర యభిప్రాయము. ఈమాటను శ్రీరామ లింగ స్వామిగారును గాదనరు.

పరిష్కృతకావ్యము, భావకవులలో దంభజాతినిగూర్చి ప్రయోగించిన పరిహాసోక్తి. ఆజాతిలక్షణములలో ముఖ్యమైనవి 'పాండిత్యలోపము' 'నియమోల్లంఘనము' 'ప్రాచీనకవిదూషణ' 'అన్యభావచౌర్యము' 'ఆత్మవంచనము' లోనగునవి. ఈ దుర్లక్షణములు గల కవులను నిదివరకే పండితులు పల్వురు పలువిధములఁ దెగడుచుండిరి. కాని యాపండితులవిమర్శలు కేవలము తిట్టులబుంగలగుట సరసములుగావు.

ఇఁక, రామలింగస్వామిగారి 'శుక్లపక్షము' కావ్యమర్యాదల పాటించిన విమర్శగ్రంథము. ఇది, వినువారికి

వెగటుగొల్పని సరసమైన హేళనకావ్యము. ఇందు లక్ష్యభూతుఁడగు దంభభావకవి కూడఁ దనవర్ణనను జూచి నవ్వవలసినవాఁడే గాని, కినియవలసినవాఁడు కాఁడు. దురాచారముల సంస్కరించుటకు నీప్రక్రియకుఁ జాలిన, యమోఘాస్త్రమింకొకటి లేదు.

ఇట్టి కావ్యములు, మనభాషలో నంతగా లేవు. విషయమునకుం దోడు వస్తువున నూత్నత్వము గూడ నున్నది గనుక నీకావ్యము లోకాదరము వడయు ననుటకు సంశయము లేదు.

విశాఖపట్టణము
తే 27—1—32 ది.

పింగళి లక్ష్మీకాంతం.

## M. R. Ry., Dr. B. Seshagiri Rao Garu, M.A., Ph.D.

"Andhra Bharati Theertha Pradhani,"
Lecturer, Maharajah's College,
*Vizianagram City.*

'శుక్లపక్షము' అను నీకృతిలోని కవిత్వం వంటిది ఇది వరలో ఆంధ్రములో లేదు. అక్కడక్కడ పూర్వాంధ్ర కవులచరిత్రలలో వికటకవిత్వములూ వేళాకోళపు కవిత్వములూ కనబడతవి. కాని ఖండకావ్యములుగానో పద్యగుచ్ఛములుగానో ఒక అభిప్రాయమునుగాని వ్యక్తినిగాని నడతను గాని వేళాకోళముచేసే కవితలు లేవనియే చెప్పవచ్చును.

వేళాకోళపు ఖండకావ్యములు చెప్పడమనేది ఆంగ్లసాహిత్యమును చదివి ఆనందించి అనుకరించినపద్ధతి. ఈకృతిలోని వేళాకోళపు కవిత్వమంతా "భావకవిత్వ"మనే నూతనాంధ్రరచనల నుద్దేశించి యున్నది. ఈవేళాకోళములో వ్యక్తిదూషణగాని, నిరసనగాని, వ్యక్తులయెడల ఆగ్రహముగాని ధిక్కారముగాని లేదనవచ్చును. రసభావభాసురమై నిరర్గళధారాశోభితమై బహువిధశిల్పవిశేషవిలసితమైన యాంధ్రకవిత్వము ను కాదని బయలుదేరిన భావకవిత్వమునే యిందలి పద్యములు హాస్యరసప్రధానముగా పరామర్శించుచున్నవి కాని నవీనాంధ్రకవిత్వము నవీనము గనుకనే నికృష్టమనుటలేదు. ఆంగ్లమందలి వేళాకోళపు కవిత్వముల

తో పోల్చిచూస్తే ఇందలి వేళాకోళము సరసమై లలితమై నాగరకమై యున్నదనియే చెప్పగలను.

తెనాలి రామకృష్ణకవి ఆంధ్రములో వేళాకోళమునకు ప్రసిద్ధపురుషుడు. రాయలవారి సంస్థానములో ప్రకటకవి. ఆయనను గురువుగా పూజించి చెప్పిన కవిత్వము గనుకనే దీనిలో నీ గుణవిశేషములు కనబడుచున్నవి. మార్గము మంచిది. హృదయము మంచిది. రచనాచాతుర్యమున్నది. కృతిహృద్యమైనదనుట కింకేమికావాలి? ఈయువకవికి నా హృదయపూర్వ కాశీర్వచనములు.

విజయనగరం,
27-1-32.

బుర్రా శేషగిరిరావు,
ఆంధ్రభారతీ తీర్థప్రధాని.

---

## M. R. Ry., Gidugu Venkata Sithapathi Garu, B. A. L. T.,
### Research Fellow, Andhra University.

శ్రీయుత అనంతపంతుల రామలింగస్వామి పంతులు గారు రచించిన "శుక్లపక్షు"మను కావ్యమును చదివి మిక్కిలి ఆనందించినాను. దీనిలో గల భావములు, రచన, శైలి, ఆంధ్రసారస్వతమునకు అపూర్వమైనవి. రసహీనమైన భావ కవిత్వమును, భావకవుల శుష్కాడంబరమును వివరించివర్ణించు టలోను, సరసముగా నిరసించుటలోను కవిగారు అద్భుతమైన చమత్కారమును ప్రదర్శించినారు.

ఆంధ్రసారస్వతమునందు సరసపరిహాస కావ్యనిర్మాణమునకు వీరే మార్గదర్శకులని చెప్పవచ్చును. అంతేకాక కవి తనకాలపు ఆదర్శములను మనోభావములను లోకమున ప్రతిఫలింప జేయగల కావ్యమును రచించినప్పుడే అతని కావ్యము సారస్వతమందొక విశిష్టమైన స్థానమును ఆక్రమించి కలకాలము ఆనందదాయకము కాగలదు. వీరి "శుక్లపక్ష" కావ్యము అట్టికావ్యమని చెప్పవచ్చును. ఇందలి పద్యములలోగల పరిహాసవాక్యములు ఆయావ్యక్తులను సూచించుటచేత సమకాలమువారికిని, కావ్యపరిణామమును సూచించుటచేత భావికాలమువారికిని మనోహరములుగా ఉండగలవు. వ్యక్తిదూషణలేకుండా తప్పుత్రోవను బోవువారిని సరియైన మార్గమునకు రప్పింపగలనేర్పు కవిగారు తమ కవితాకల్పనలోనే సరసముగా ప్రదర్శించినారు. భావగాంభీర్యమునకు అనుగుణములగు పదములను సమకూర్చుటలో వీరికి అద్భుతమైన శక్తిగలదు. ఆంధ్రలోకము వీరిని, వీరికవిత్వమును హెచ్చరించి ఆదరించునుగాక !

విశాఖపట్నం, 26-1-32.

గిడుగు వెంకట సీతాపతి,
రిసెర్చి ఫెలో, ఆంధ్రయూనివర్సిటీ.